# చతుర్వేద దేవత మూర్తుల రూపములు



## చతుర్వేద దేవతా మూర్తుల రూపాలు

స్థావర (కదలనివి), జంగమ (కదిలేవి) జగత్తులో ప్రతి అంశానికీ అధిష్ఠాన దైవాలుంటాయి. నదులు, పర్వతాలు - మొదలైన వాటికి కూడా దివ్యదేహాల దేవతా రూపాలున్నాయి.

అదేవిధంగా **ఋగ్వేద, యజుర్వేద, సామవేద, అధర్వణ వేదాల**కూడా దేవతా రూపాలున్నాయి. ఆయా వేదాలలో ఉన్న లక్షణాలు ఆ వేద మూర్తుల్లో గోచరిస్తాయి. ఆ దివ్య రూపాలు ఇచ్చట ఇవ్వబడినవి.

1. శ్లో|| ఋగ్వేదః శ్వేతవర్ణస్స్యాత్ ద్విభుజో రాసభాననః
అక్షమాలాధర సౌమ్య: ప్రీతో వ్యాఖ్యాకృతోద్యమః
ఋగ్వేద దేవత తెల్లని రంగు గలది, దీనికి రెండు చేతులుందును.
దీని ముఖము గాడిదముఖము. అక్షమాలను ధరించి సౌమ్యముఖముతో, ప్రీతిని ప్రకటించుచు వ్యాఖ్యానము చేయు యత్నములో నుండును

2. శ్లో| "అజాస్యః పీతవర్ణస్స్యాత్ యజుర్వేదో క్షసూత్రధృత్
వామే కులిశపాణిస్తు భూతిదో మంగళప్రదః"
యజుర్వేద దేవత మేక ముఖము కలదై పసుపు పచ్చని రంగుతో జపమాలను ధరించి, ఎడమ చేతి యందు వజ్రాయుధమును ధరించి, ఐశ్వర్యమును శుభమును ప్రసాదించుచుండును.

3. నీలోత్పల దళశ్యామో సామవేదో హయాననః
అక్షమాలాన్వితో దక్షేవామే కుంభధరః స్మృతః |

సామవేద దేవత నల్లకలువ రేకు వలె నిగనిగలాడు నీల శరీంముతో, గుఱ్ఱము ముఖముతో కుడిచేతిలో అక్షమాలను, ఎడమతో కుందను (పూర్ణకుంభమును) ధరించి యుండును

4. శ్లో| అధర్వణాభిధో వేదో ధవళో మర్కటానన:
అక్షమాలాన్వితో వామేదక్షే కుంభ ధరః స్మృతః
అధర్వణవేద దేవత తెల్లని రంగుతో, కోతి
ముఖముతో, ఎడమ చేతిలో జపమాలతో, కుడి
చేతిలో (పూర్ణకుంభము) కుండతో
విలసిల్లుచుండును.